# రామలక్ష్మీనరసింహ విలాసము

ఇది యొక యపూర్వ ప్రబంధము. ఈ కలికాలపు స్వప్నములు, వాని ఫలితములు విశదముగ వ్రాయబడి యున్న నీతిబోధకము. మూండ్లాశ్వాసముల గ్రంథము. సులభశైలి నున్నది. త్వరలో వెలువడనున్నది.

# ప్రభాకర.

ఒక సంస్కృత సమస్య ననుసరించి వ్రాయబడిన [illegible]కముల నాటకము. కథాచమత్కృతి గౌరవనీయమైనది. కవి చాతుర్యము మిగుల గొనియాడదగినది. అఖిలజనాదరణీయమైనది. సర్వజనులు పఠించుటకు ననుకూలముగ నుండునట్లు వ్రాయబడియున్నది. వెల స్వల్పము. త్వరపడుడు. ప్రతి 1కి రు 0-8.

వలయువారలు:—

బాలకవి జమ్ములమడక లక్ష్మీనరసింహము,

కోరుతాడిపర్రు అగ్రహారము,

ఆంధ్రబుక్కుడిపో, అమర్తలూరు పోస్టు,

తెనాలి. తాలూకా,

గుంటూరుజిల్లా. గుంటూరుజిల్లా

అని వ్రాయవలయును.

శ్రీరస్తు.

# సురాబుద్ధాల

లేక

## అనామాన్య

(ఐదంకముల నాటకము)

ఇది

శ్రీ విజయభాస్కరము, సత్యాబాయి, చిత్రరేఖ,
ప్రభాకర, మిత్రప్రేమ మున్నగు నాటకముల
గ్రంథకర్తయగు
బాలకవి జమ్ములమడక లక్ష్మీనరసింహాముచే
రచియింపఁబడినది.

తెనాలి ఆంధ్ర బుక్కుడిపో ప్రొప్రైటరు
డి. కే. యస్. ప్రకాశరావుచే ప్రకటింపబడినది.

1000 ప్రతులు.

బెజవాడ వాణీముద్రాక్షరశాలలో
ముద్రింపబడియె.

 [వెల 0-8-0.

# పీ ఠి క.

---

ఇది నా యాఱవ నాటకము. ఇందలి కథాభాగము 'భారత రమణీమణుల' నుండి గ్రహించితిని. నీతి బోధకమగు నాటకమని తలఁచి యాబాలగోపాలమునకుఁ దెలియునటుల, క్లిష్టపదములు లేక, దీర్ఘ సమాసములఁ గూర్పక, సులభమగు శైలిన, పద్యములఁగూడ క్లుప్తపఱచి వ్రాసితిని. ఎట్టిలోపము లున్నను చదువరులు నా యవజ్ఞతను క్షమియింతురని ప్రార్థించుచున్నాను.

కోరు తాడిపత్రు అగ్రహారము, 22-11-1923.

ఇట్లు,
బా ల క వి,
జమ్ములమడక లక్ష్మీనరసింహము.

# ప్రకటన.

యీ నాటకముయొక్క సర్వహక్కులు (All Rights—Reserved) తెనాలి ఆంధ్ర బుక్కుడిపో ప్రోప్రైటరు డి. కే. యస్. ప్రకాశరావు గారికి చెంది యున్నవి గనుక వారి అనుమతి లేనిది ప్రచురించుటయు గాని ప్రదర్శించుటయుగాని కూడదు.

ఇట్లు,

గ్రంథకర్త.

# ఇందలి పాత్రలు

---

## పురుషులు

1 సురాజుద్దౌల—(ముర్షిదాబాదు నవాబు)

2 భటుఁడు.

3 మతుబుచందు—(ఒక వర్తకుఁడు).

4 సద్గుణచందు—(మతుబుచందుని యల్లుడు).

5 రామప్రియాజీ—ఒక వైద్యుఁడు.

## స్త్రీలు.

1 బేగము.

2 అసామాన్య—(మతుబుచందుని కుమార్తె).

(ఇంక నటి, సూత్రధారుఁడు వత్తురు).

శ్రీ ర స్తు.

# సుధాబుద్ధాల

లేక

# అసామాన్య

[నాంది]

తే. గీ. పృథివి తన సౌఖ్యముల వీడి • రిపులఁగాచి
యమలసద్గుణ శీలయై • యలరినట్టి
సరసిజాక్షి యసామాన్య • సాధుగుణము
తతయశం బేర్పడఁగమీకు • తనరుఁగాత!

(నాంద్యంతమున సూత్రధారుఁడు ప్రవేశించి)

నీతి భోధకమగు నవీననాటక ప్రదర్శనమునకు సభాస్తారులు వేచుకొని యున్నవారలు కాఁబోలు! నేను పిలచు నగత్యము లేకుండఁగనే నటి వచ్చినదికదా!

(నటి ప్రవేశించి)

ఆర్యపుత్రా! యేమి మీ యాలోచన?

సూత్ర—ప్రేయసీ! అతి ప్రసంగమేల? బుధస్తవ్యులును, యశో విశాలురును, సద్గుణసంపన్నులును, పెదరావూరు వాస్తవ్యులునగు జగర్లపూడి వేంకటప్పయ్య గారి కంకితముగా నొనర్పఁబడిన "సురాజుద్దౌలా" లేక "అసామాన్య" యను నైదంకముల నవీననాటకము నేడు ప్రదర్శింప వలయును.

నటి—(ఆశ్చర్యముతో) ఏమి! నాటకము పేరేది? 'సురాజుద్దౌలా' యా?

సూత్ర—అవును. 'అసామాన్య' యను యింకొక పేరుకలదు. కొరుతాడిపర్రు అగ్రహారం నివాసులగు బాలకవి జమ్ములమడక లక్ష్మీనరసింహము గారిచే రచియింపఁ బడినది. నీతి బోధకము. సులభశైలిని వ్రాయఁబడియున్నది.

నటి—ఈనాటక మంకితముఁ గొన్న వారు గ్రంధకర్తగారి కేమగుదురు?

సూత్ర—గ్రంధకర్త గారిని చిన్నతనాన నుండియుఁ బెంచి పెద్దవారినిఁ జేసి విద్యాపరిపూర్ణులఁ జేసిన ఘనులు—పుణ్యులు—మాతామహులు వారలేకదా! ఈవిధమునఁ గాక వారిఋణమును గ్రంధకర్తగారు మఱేవిధమునఁ దీర్పఁ గొనఁ గలుఁగుదురు?

నటి—అవును.

[తెరలో]

ఈ భూలోకమున ధన్యుఁడను నేనేకదా!

సూత్ర—నటీ వేగిరమే పోవుదము రమ్ము. వేషధారుఁడై మతుబుచందు వచ్చి యున్నవాఁడు.

నటి—వెళ్ళుదము.

[ఇరువురు నిష్క్రమింతురు.]

(ఇది ప్రస్తావన)

---

ప్రథమాంకము—ప్రథమరంగము.

[ముర్షిదాబాదునందలి సౌధమునఁ గూర్చుండి మతుబుచందాలోచించుకొను చుండును.]

ఈ భూలోకమున ధన్యుఁడను నేనేకదా!

తే॥ గీ॥ భోగభాగ్యము లున్నవి ♦ పూర్ణముగను
విద్యయున్నది తగినంత: ♦ బిడ్డయుండె
నేమిదక్కువ నాకింక ♦ భూమియందు
పైనప్రభునంత వాని లోఁ ♦ బఱచుకుంటి

నవాబగు సురాజుద్దౌలా త్రాగుబోతు—స్త్రీలోలుఁడు—మందుఁడు—క్రూరుఁడు. తనరాజ్య మందు నాతని కొక్కఁడు మిత్రుఁడగువాఁడు లేఁడు. నే నొక్కరుఁడ నాతనికి వలయునప్పుడు ధనము, సారాయి మున్నగునవి సాయముఁ జేయుచు, కోరినకాంతనుఁ దెచ్చియిచ్చుచు మైత్రినార్జించి రాజకీయ వ్యవహారములలోఁ గొంత కొంతయధికారమును పొందుచుంటిని. ప్రజల కెల్లరకు నవాబుపై నెంత ద్వేషము

కలదో నాపై గూడ యంతకలదు. కాని నాకు భయమేమి? వారు నన్నేమి సేయఁగలరు? సురాజుద్దౌలాకు నాపై మంచి యభిప్రాయముకలదు. నేను చెప్పినమాట కాతఁ డెదురాడ లేడు. నవాబునకు నాకు నింత మైత్రిఁగూర్చిన యా భగవంతుఁ డుదార కృపామతియై మమ్మాచంద్రతారార్కము కాపాడుఁ గాక! పోయి నవాబుదర్శనముఁ జేసుకొని యెదను.

(అని నిష్క్రమించును.)

తెఱపడును

---

ద్వితీయ రంగము.

[ముర్షిదాబాదు నందలి రాజసౌధమున సుర్భాజుద్దౌలా, మతుబు చందు మాట్లాడుకొను చుందురు.]

సురా—మతుబుచంద్! విశేషము లేమి?

మతు—దేవా! మఱేమియును లేవు.

సురా—బొక్కసమున ధనము శూన్యముగా నున్నది సూరత్ సాహాయి లేదు.

మతు—సాహాయికొరకు వార్త సంపియుంటిని. నేఁడో రేపో దప్పక వచ్చును.

సురా—మంచిది. నీవుకదా నా కాప్తుఁడవు.

మతు—మీకు నేనొక రహస్యముఁ జెప్పఁదలఁచుకొని యుంటిని. ఆజ్ఞ నొసంగుదురా?

సురా—నీకాజ్ఞ కావలయునే! శీఘ్రమే యది యేదియో తెలియఁజెప్పుము.

మతు—చెప్పెదను. మన యిరువుర మైత్రిప్రజలకంత సమ్మతముఃగా నున్నట్లులేదు. పలుతెరగుల మనల నిందించుచున్నవారలు. నా మూలమున మీరు దుష్ప్రవర్తకులై యధర్మ పరిపాలన నొనర్చుచు ప్రజల హింసించుచుండిరని యపవాదొకటి బయలువెడలినది . ఈ విషయముఁగూర్చి మీ యభిప్రాయ మెట్లున్నదో?

సురా—(కోపముతో) ఏమీ! నా రాజ్యమునందే యిట్టి యపవాదులు బయలుదేరుచున్నవా? నాప్రజలెల్లరు నన్ను మఱచిరా? కానిమ్ము. మతుబుచంద్! నీకెట్టి భయమువలదు. ఈ విషయమై నేనుతగిన చర్చఁజేసెదను

మతు—దేవా! ఆగ్రహము వలదు.

తే. గీ. ప్రజలకిట్టితలంపు లు • ద్భవములగుట
కరయఁ గతమేమొ యింతకు • నెఱుఁగనైతి
చేరి మీతోడ నేమైత్రి • సేయుచున్న
జూచిసహియింపఁ జాలరో • క్షోణియందు

సురా—అవును. అదియేకారణము. అంతయు నాలోచించెదను. ఇఁక నీవు పొమ్ము.

మతు—వెళ్ళెదను. (అని నిష్క్రమించును)

సురా—నాపరిపాలనలో నున్న ప్రజలకిట్టి దురభిప్రాయములు జనించుట మాత్రము ప్రభుత్వవిధానములోఁ దగనిమార్పులకే! ఈమార్పులు మున్ముందెట్టి ఫలితములఁ జేకూర్పనున్నవో కదా! ఇఁక నేనూరకుండినఁ బ్రయోజనము లేదు. ఊరకుండక నేమి సేయుదును? (ఆలోచించి) ఏమి సేయ లేక యేమి? ఈరాజ్యమంతయు నాయఱచేతిలో నున్నయది. నేనేమిచేసిన నన్నడ్డుపెట్టువార లెవ్వరు? చూచెదను. ప్రజలకుఁ గఠిన శాసనములొసఁగెదను. ఎల్లర నామతములోఁ గలిపికొనియెదను. నాకంటి కింపగు కాంతలనాభార్యలుగా స్వీకరించెదను. త్రాగు డందఱ కుండునటుల నొకచట్ట మేర్పఱచెదను. హిందూదేవాలయములు నారాజ్యములో లేకుండునటుల జేసెదను. ఇకెన్నియో చేసెదను. నా యాజ్ఞల నతిక్రమించు వారలకు మరణ దండన విధించెద. నాపరిపాలన ధర్మమైన సరియే! అధర్మమైనను సరియే! ఎట్టులైనను రాజ్యాంతే నరకం ధ్రువం కదా! చచ్చిపోయిన జనులకు స్వర్గము లభించునో నరకము లభించునో చెప్పువార లెవరు? చూచు వార లెవరు? ఎవ్వరును లేరు. నా ప్రభుత్వ విధానములో మార్పులు కలిఁగించి నేను చేయుదలఁచిన దంతయును దప్పక చేసెదను. నా నిరంకుశ ప్రభుత్వము నాజన్మమును సఫలముఁ జేయుగాక, (అని లేచి) ఎవ రావెలుపల?

భటుఁడు—[ప్రవేశించి] చిత్తము మహారాజ!

సురా—ఏమిరా? ఏమి సేయుచుంటివి?

భటు—(భయముతో) వెలుపలనుంటిని.

సురా—పోయి సారాయి దీసుకొని రమ్ము.

భటు—చిత్తము (అనిపోయి, సారాయి దీసుకొనివచ్చి, యిచ్చును)

సురా—(కడుపారఁ ద్రావి) నీవు శీఘ్రమేపోయి మతుబుచందుని బిలచుకొనిరమ్ము.

(భటుఁడు నిష్క్రమించును)

సురా—బాగుగా నాలోచింప

ఆ॥ వె॥ మతుబుచందుతోడ • మైత్రిసేయుట నేను
తప్పుగా జనములు • దలచినారు
తగిన సఖుఁడునాకుఁ • దలపోయనాతండె
పరులమాట లేల • పాటిసేతు

కానిమ్ము

(బేగము ప్రవేశము)

దీర్ఘాలోచనలో నుంటిరా?

సురా—సతీ! లేదు. లేను. ఎందులకు?

బేగ—ఎందులకని యడిగితిరి కానఁ జెప్పెద వినుఁడు.

సురా—ఇప్పుడేమి వార్తఁ దెచ్చితివి?

బేగ—నాథా! మీకు వచ్చినయపకీర్తి మీ రెరుగుదురుకదా!

సురా—ఏమి యపకీర్తివచ్చినది?

బేగ—మతుబుచందుతోఁడఁ దగని మైత్రియే మీకిట్టి యపకీర్తి దెచ్చుచున్నది.

సురా—ఏమీ! నీకుఁగూడ యట్టి యభిప్రాయమేనా?

ఆ॥ వె॥ మతుబుచందుకంటె • మాన్యుఁడౌ సఖుఁడేడి
లేడు నిక్కముగను • లేడు లేడు
విషయమంత యెఱిఁగి • వెఱ్ఱిలో బడితివి
లేమ యింత తగునె? • యేమి సేతు?

బేగ—రాజ్య పరిపాలకు లగు మీరు, నిష్ప్రయోజకుఁడు—త్రాగుబోతు—కుటిల బుద్ధియగు నొకవర్తకునితో మైత్రి సేయుట హాస్యకరము—దూష్యముగా నున్నదే కాని వేఱు కాదు. మతుబుచందుతో మైత్రి మి మ్మపకీర్తి పాలు సేయుచున్నది. నామాట నాలకింపుఁడు.

సురా—కాంతా! యిది నీయుద్దేశ్యమేనా?

బేగ—ప్రజలెల్లరకుఁ గలదు.

సురా—ప్రాణేశ్వరీ! నన్ను చూచి ప్రజలు భయపడవలసినదే కాని ప్రజలను చూచి నేను భయపడవలసినపని లేదు. మతుబుచందుతో మైత్రి విడువఁ దగినది కాదు. విడువను. ఈ విషయమై యిక నీకు నాతో యతిప్రసంగము వలదు. పొమ్ము.

బేగ—తుదకు మీవలన నేను వినవలసిన పలుకు లివియే కదా!

(అని నిష్క్రమించును.)

సురా—స్త్రీలకు చనువిచ్చుట బహుదోషము.

[మతుబుచందు ప్రవేశము]

సారాయి వచ్చియున్నది నాకొఱకు భటునిఁ బంపితి రందులకేనా యేమి?

సురా—కాదు. కాదు. కూర్చుండుము.

మతు—(కూర్చుని) మంచియాలోచనలోఁ బడితిరే.

సురా—మతుబుచంద్! నీవనిన యట్లు మనపై లోకాపవాదులు జనించిన మాటవాస్తవము.

మతు—వాస్తవమని మీ కిప్పటికి స్పష్టమైనది కాఁబోలు! నా కిదివఱకే తెలిసినది.

సురా—అవును. నీవు చెప్పుటఁ బట్టియే నాకిప్పటికైన నీ విషయము తెలసినది. ఇఁకదగినపనిఁ జేసెదను

మతు—ఏమి చేసెదరు?

సురా—చూచెదవుకదా!

మతు—ఎటులయిన నా కపకీర్తి రాకమానునా?

సురా—రానిమ్ము. అపకీర్తి వచ్చి నిన్నేమియు సేయఁజాలదు. కీర్తి వచ్చినిన్నుద్ధరింపఁజాలదు. ప్రజలకు నీవు భయపడవలసిన యవసరములేదు.

మతు—కానిండు. నేను మీయాజ్ఞానుసారముగాఁబ్రవర్తించెదను.

సురా—మతుబుచంద్! నీకెట్టివెఱపువలదు. ఇకనీవు గృహమునకు బొమ్ము.

మత్తు——సా రాయిబంపెదను. (అని నిష్క్రమించును)

సురా——కానిమ్ము. చూచెదను. (అనిలోపలకుఁబోవును)

తెఱపడును

---

## తృ తీ య ర ం గ ము.

[ముర్షిదాబాదునందలి సౌధమునఁగూర్చుండి సద్గుణచందు, అసామాన్య మాట్లాడుకొనుచుందురు]

సద్గు——ప్రేయసీ! నీతండ్రి వ్యవహారము నాకేమియు బాగుఁడలేదు అతనికి నవాబుతో స్నేహమెందులకు? ప్రజలెల్లర కిందుమూలమునఁ బగవాడగుచున్నవాడు. ఎవరేమిచెప్పిన వినజాలడు. మంచిచెడ్డలెఱుంగఁడు. కష్టసుఖముల గుర్తింపఁడు. దూరాలోచన సేయఁడు. ఈమైత్రిమూలమున నాతనికివచ్చు లాభమేదియో నాకుఁ దెలియకున్నది. నిరర్థకముగా నవాబుక్రింద తానుధనమంతయు వ్యయము సేయుచుండెను. దుర్వ్యాపారములయందు నవాబునకుఁ గుడిచేయిగా నున్నవాఁడు. రహస్యముగనింక నేమేమి యోసాయములు చేయుచున్నవాఁడు. ఇన్నియువిచారింప నీతండ్రి ప్రవర్తన నీయుద్దేశ్యమున కెట్లున్నయది?

అసా——నాకేమియుద్దేశ్యము? వారియభిప్రాయమును నేనుగుర్తింపఁజాలను. మనమేమేనిసెప్పుటకు వారుమనమాటలుబొత్తుగాపాటిసేయరుకదా?

సద్గు—మన మేమి చెప్పఁగలుగుదుము?

అసా—జ్ఞానశూన్యులగు చుండిరికదా యని చింతింపవలసిన దే!

తే. గీ. దుష్టునకు నీతిగరపుట • దుస్తరంబు
శ్రమవహించి కరపిన సా • ర్థకము లేదు
కుక్కతోఁకనుఁ సరిజేయ • చిక్కకరము
చేసినను ఫలమున్న దే • క్షితిని సుంత?

నాతండ్రి విషయమై నికనింతియే!

సద్గు—అట్టిప్రవర్తన మున్ముందాతనికి పెక్కుకష్టములజేకూర్చును.
ఈవిషయ మెరుగఁ జాలకున్నాడు.

అసా—అవును. వినాశకాలే విపరీతబుద్ధిః. కానిండు.

సద్గు—నీతండ్రిగారివిషయ మాలోచించినప్పుడెల్ల నామనసెం
దులకోకాని కల్లఁతలోఁబడును.

అసా— నాథా!

తే. గీ. పరులమాటల వినునట్టి • ప్రజలసేరి
చెప్పఁదగు నీతు లెవరేని • చెలువుమీఱ
లోకములకెల్ల వైరియై • వీకనుండు
దుష్టునకు చెప్పఁగల సమ • ర్థుండెవండు?

సద్గు—అవును కాని...

అసా—మీరిట్లుసదా కల్లఁతఁ బడుచున్ననా కేమి ధైర్యముండును?

సద్గు—మోహనాంగీ!

తే. గీ. క్ష్మాపతుల మైత్రియేపాణి • సంకటంబు
మ్లేచ్ఛులను సేరుటందుల • మేలుకాదు

పాములను పెంచుకొనుంత • ప్రాణహాని
తాఁచుపాముల సాకుట • తగునెయబల!

నీతండ్రిగారు సమస్తమునెఱిఁగిన వారయ్యు నిట్లమానుష కృత్యములకుఁ బాల్పడుట నాకుబహు విచారముగనున్నది.

అసా—మీకువిచార మెందులకు? ఇకమనజీవితకాలములో మనమువారిని సత్ప్రవర్తనకు మఱల్పజాలము.

సద్గు—అని యూరకుండుటతగునా?

అసా—చేయునదియేమి?

సద్గు—నీతండ్రినిసేరి నీవిషయముఁ బ్రసంగవశమునఁనెత్తి యాతని సత్ప్రవర్తనకుఁ దేజాలవా?

అసా—అట్టిసమర్థతయే నాకడ యున్ననింకేమి? మొట్టమొదట నుండియువారు నామాటలఁ బాటించువారలేనైన నిప్పుడిట్టి యపఖ్యాతి పాల్పడుదురా? లోకనింద్యులగుదురా? వారు సత్ప్రవర్తకులై విస్తృతయశముఁ గాంచుట నాకుమాత్రము సంతసముకాదా? ఈజన్మమునకిక యాభాగ్యము లేదు.

సద్గు—నేనైన హెచ్చరించెదను.

తే. గీ. కాలవశమున దుష్టుఁడై • గ్రాలువాడు
క్షితినిహితముల సద్గుణ • శ్రీ జయించు
పట్టుఁబడినఁ గ్రూరతఁజరించు • వన్యమృగము
పుడమికరిన శిక్షకులోఁ • బడెడుపోల్కి.

అసా—కానిండు. (అనియిరువురు లోపలకుఁబోవుదురు)

తెఱపడును

శ్రీరస్తు.

# సురాజుద్దౌల

లేక

# అసామాన్య.

## ద్వితీయాంకము — ప్రథమరంగము.

[ముర్షిదాబాదునందలి రాజసౌధమునఁ గూర్చుండి సురాజుద్దౌలా యాలోచించుకొనుచుండును.]

ఆసుందరినిఁ జూచినప్పటినుండియు నాహృదయ మెట్లెట్లో యున్నది. చెప్పఁజాలను. నిలువఁజాలను. మదనుఁ డదయుఁడై వేధించుచున్నవాఁడు. తప్పించుకొను మార్గమేది? ఆమోహనాంగి బాహువల్లికాండోలికాభాగమున నూఁగుటయేగదా! ఆ కురంగ లోచన కుచయుగ్మమధ్యప్రదేశమున దాఁగుటయేకదా! ఆ మద గజయానను సాయముఁ దెచ్చుకొనుటయేగదా! ఇన్నికార్యముల నే నెట్లు నెరవేర్చుకొనఁగలుఁగుదును? నా హృదయ పరితాప మేరీతి నడఁగును? మదనవేదన దుస్సహముగదా! మన్మథా! నీ ప్రతాపమేమి! నీ సాహసమేమి! నీ ధైర్యమేమి! నన్నెటులఁ గలఁచుచుంటివి?

తే॥ గీ॥ భిక్షుకుండైన శివునిపైఁ • గక్షఁబూని
చచ్చిపోయిన మాట వా • స్తవముకాదు
ప్రభుఁడనగునన్నుఁ గదియంగ • వత్తువేని
నిక్కముగు చావు లభియించు • నీకు మదన॥

కావున నీ శౌర్యధైర్య సాహసాది గుణము లన్నియును నాకడఁ జూపకుము. (కొంచెమాగి) ఏమీ! మతుబుచందు పుత్రికారత్నము, త్రిలోక మోహినియగు యసామాన్యపై భ్రాంతిచే కదా నేనిప్పు డోడలు మఱచితిని. మతుబుచందు నా ప్రాణస్నేహితుఁడే! కాని యందుమూలముఁన నే నా సారంగలోచనను విడచుటమాత్రము స్వప్నగత వృత్తాంతమే. మతుబు చందునకూ నాకూ మైత్రి చెడినను చెడిపోవుఁగాక! త్రిజగన్మోహనమైన యీ యసామాన్యసౌందర్యముఁ గాంచిమాత్రము వైరాగ్య వృత్తి నవలంబించు వెంగలి యీలోకమున లేడు. ఏనాడు తల్లితో యుద్యానవనమునందు విహరించుచుండ నా యేణాక్షి నా కనులఁ బడియెనో యానాడేకదా నాచిత్త మతి చంచలమైనది. యానాడేకదా నా సర్వస్వ మాయన్నులమిన్న కర్పించితిని; యానాడేకదా యాసరోజనేత్రి నాపాలిటఁ బడియెనని తలంచితిని; యానాడేకదా యాప్తమిత్రుఁడగు మతుబుచందు నాకు గర్భశత్రువాయెనని దలంచితిని. ఇంత యాలోచన యేటికి? శీఘ్రమే స్త్రీవేషమున నసామాన్యను చేరెదను. నా కోర్కెఁ దీర్చుకొనియెదను. (అని నిష్క్రమించును) (తెరపడును).

## ద్వితీయరంగము.

---

[ముర్షిదాబాదునందలి సౌధమునఁ గూర్చుండి యసామాన్య యాలోచించుకొను చుండును.]

ఇతరుల నీతులు వినఁజాలరు. వారికిఁ దోఁచదు. సన్మార్గమున సంచరింప నొల్లరు. మంచిచెడ్డల విచారింపరు. కష్టసుఖములఁ బాటింపరు. యోగ్యాయోగ్యత గుర్తింపరు. నాతండ్రిగారిట్లు దుష్ప్రవర్తకులగుదురని కలనైనఁ దలఁపనైతిని. కుమతి— నిష్ప్రయోజకుఁడు— మ్లేచ్ఛుఁడు— త్రాగుబోతు— పరకాంతా భోగాసక్తుఁడు— రాజ్యమదాంధుఁడు— లోకశత్రుఁడగు సురాజుద్దౌలాతోడ నాజనకునకంత తగనిమైత్రి కష్టములకేకాని సుఖములకా? ఆతఁడు మ మ్ముద్ధరించునా? కాలభుజంగముతో మైత్రిసేయు కప్ప గలదా? వ్యాఘ్రముతో సంచరించు వృషభము కలదా? మా యదృష్టరేఖ తొలఁగనున్నదికాఁబోలు! మా సౌఖ్యముల కంతరాయములు సంఘటిల్లనున్నవి కాఁబోలు! మా భోగభాగ్యము లడుగంటనున్నవి కాఁబోలు! ఏమిసేయుదును? భగవానుఁడా? నీ తలఁపేమి?

(అని యూరకుండును.)

[స్త్రీవేషమున సురాజుద్దౌలా ప్రవేశించును.]

పంకజాక్షీ, భయము వలదు.

అసా—(ఆశ్చర్యస్తబ్ధయై) ఏమియిది! నీ వెవతెవు?

సురా—నారీ! ఎవరవని ప్రశ్నింపుము. చెప్పెద.

తే॥ గీ॥ విస్తృత యశుండ, జగదేక • వీరవరుఁడ,
నీ జనకునకు మిత్రుండ • నీరజాక్షి!
పృథివిఁ బాలించువాఁడ, నీ • వెఱుఁగవేల?
యవని నన్నెఱుంగని వార • లెవరు కలరు?
సురాజుద్దౌలాను. కల్యాణీ! యికనైన గుర్తించితివా?

అసా—(ఆశ్చర్యముతో)ఏమీ! సురాజుద్దౌలావా!
(అని దూరముగఁ బోవును.)

సురా—సుదతీ! భయపడెద వెందులకు?

అసా— (కోపముతో) ఎందులకందువా? మ్లేచ్ఛుఁడవు— త్రాగుబోతువు— కపటబుద్ధివి— జ్ఞానశూన్యుఁడవు— త్రాచుపామువు— తురుష్కప్రభుఁడ వగునిన్ను, నీ యమోఘ సాహస కార్యములను, నీ హీనపరాక్రమమును, నీ యధర్మ పరిపాలనను చూచి భయపడుచుంటిని. ఆడువార లుండు ప్రదేశములకు నీ వీ మాయారూపమున రాఁ గత మేమి?

సురా—కాంతా! కోపము వలదు. నీ ప్రశ్నకుసమాధాన మిచ్చెదను.

తే॥ గీ॥ నీ యధరసుధారసమును • నెమ్మిఁ ద్రావి
దప్పికను దీర్చుకొనునట్టి • తలఁపుతోడ

నిక్కడకు వచ్చియున్నాడ • నిందువదన
తగదు కోపంబు కోర్కెఁ దీ • ర్పగనురము.

తే॥ గీ॥ తెండుచేతుల మారుఁ ష • ద్దండ మహిమ
పూలటమ్ముల వదలుచుఁ • జాలనాకు
శ్రమలఁ గల్పింపఁ దగినట్టి • సాధకంబు
లేమి నీ సాయమునుకోరి • లేమ! యుంటి.
ఇదియే నాకిక్కడ పని.

అసా— (కోపముతో) ఔరా! ఏమిరా నీమదము! రాజ్యమదాంధుఁడవై క్రిందుమీఁదుఁగానకఁ బ్రవర్తించుచుంటివి. నా తండ్రితో నీవు మైత్రిసేయుట కిట్టి యమానుష కృత్యముల కని నే నెఱుఁగనైతిని. ఛీ! దుర్మార్గా! బుద్ధిఁ దెచ్చుకొని పొమ్ము.

సురా—కోమలీ! నిన్నుఁ గూడక నే నెక్కడకుఁ బోయెదను?

అసా—(కోపముతో) క్రూరాత్మా! సమయమునకు మావారిక్కడ లేకఁబోయిరి. ఉండియుండిన నీకుఁ దగినబుద్ధిఁ జెప్పువారలు కదా!

సురా—(నవ్వుచు) సారంగలోచనా! సంభ్రమ మెందులకు? నాకెవ్వరెట్టి బుద్ధినిఁ జెప్పజాలరు. వ్యర్థప్రసంగములతోఁ గాలముఁ గడుపక వేగిరమేవచ్చి నా కోర్కెఁ దీర్పుము. నీవు జాగుచేసిన నేనే నిన్నుబలాత్కారముగనైనఁ గొనిపోవుట సత్యము.

అసా—(బిగ్గరగా) ఏమిరానీవదరు బోతుతనము! ప్రభుఁడవు— దుష్కృత్యములొనరించు జనులశిక్షించి నీతిమార్గమునకుఁ దేవఁసినఁవాఁడవు---ధర్మరక్షణకు ప్రాణముల నైననీయదగిన వాఁడవు—నీవేయిట్లు పండగములకుఁ బాల్పడి యధర్మమును వృద్ధిసేయుచున్ననిక నీప్రజలెట్లుందురని తలఁచితివి? నీకీమాత్ర మైనజ్ఞానము లేదా? పశుప్రాయుఁడవా? ఛీ! ఛీ! దుర్మార్గ! దూరముగనుండుము. బాగుపడఁదలఁచినవాఁడవైతివేని మా వారిచ్చటకు రాకమున్నే నామాటవినిపొమ్ము మూర్ఖించిన నీకుమరణమే నిక్కువమగును.

(అనిపోవుచుండును)

సురా—నారీమణీ! నీకు భయమువలదు. నన్నుచంపువారెవరును లేరు. పోయెదవెక్కడకు? రమ్ము. నాతోఁగ్రీడింపుము.

(అని చేయిఁబట్టుకొని లాగును)

అసా—(ఇంకబిగ్గరగా) అయ్యో! యెవ్వరును లేరా? ఈదుర్మా ర్గుఁడు నన్నుబాధించుచున్నవాఁడు.

[సద్గుణచంద్రప్రవేశము]

ఓరీ! ద్రోహుఁడా! నీకిదియేమిసాహసము! మతుబుచం గు నీప్రాణమిత్రుఁడేకదా! మిత్రద్రోహమునకుఁ బాల్పడితివేల?ఎంత నీతివిహీనుడవు? ప్రజలకష్టసుఖములఁ బరిపాటి పాటింపవలసినవా డవై యుండి, నీతిపాలన నెగడుచు ధరణీచక్రమందు ధర్మసంరక్షణ చేయఁదగినవాఁడవై యుండియు రాజ్యమదాంధుడవై క్రించు

మీఁదు తెలిసికొనఁజాలక వర్తించుచుంటివి. నీవొనరించు కార్యములు మంచివో చెడ్డవో యెఱుఁగఁజాలవు. నిన్ను నేటికి? నీప్రవర్తన యెఱిఁగియు నీయోగ్యత, నీప్రతాపము, నీశౌర్యధైర్యసాహసములు గుర్తించియు, నీదుర్వ్యాపారసంఘటనాపారీణత, నీకల్మషచిత్త చాంచల్యము, నీనిరంకుశ పరిపాలనా విధానము, నీవిషయమై సమస్తము తెలిసినవాఁడయ్యును మతుబుచందు నీతోయింత తగనిమైత్రిచేసి తనకొంపకింత దుస్థితియే కాదు, తన గౌరవమున కింతహానియే కాదు, తనసుఖజీవమునకిట్టి యంతరాయమే కాదు, తనసర్వస్వమున కిప్పుడెంతయో మోసముఁదెచ్చుకొని యున్న వాఁడు. ఆతని యనవలెను. రానున్న ఫలము లాతఁడే యనుభవింప వలయును. ఓరీ! కుటిలాత్మా! నీకీదుర్బుద్ధి యూరక జనియింపలేదు. నీపదవిని, నీగౌరవమును, నీరాజ్యమునే నీవునిల్పుకొనఁ జాలవు. నీజన్మ హేయమైనది. నీకంటెజగన్నిందుఁడు వేఱొండు లేడు. ఛీ! పాపాత్మా! యీయోండురూపమున సిగ్గుమాలిన వాడవైయింత హైన్యవృత్తికిఁ జొఱఁబడ నీకర్మమేమికాలినది. నీపత్నినెవడైన నిటేవిధమునఁ గదిసి యవమానపఱచిన నూరకుందువా? నీకులము సందిట్టివృత్తి లోకస్తుత్యమా? నీకులాచారమా? మూర్ఖా! మాటలాడవేమి? ఒడలుమఱచితివా? నీకీయవమానముచాలదా?

(అనిచెప్పుతోఁగొట్టి వెలపలకుఁ ద్రోయును)

సురా—(కోపముతో) మఱచిపోవుదునా? కానిమ్ము.

(అని నిష్క్రమించును)

సద్గు—ప్రేయసీ! ఆపాపాత్ముఁ డిక్కడి కెట్లువచ్చెను?

అసా—నాథా! ఆడువేషమున వచ్చి నాతోడ నసందర్భప్రలాప మున ముచ్చటింప దొడంగెను.

సద్గు—నీతండ్రికాతనితోడ మైత్రితగదని నేను మొట్టమొదట నుండియుఁ జెలుపుట లేదా? నేనెంత చెప్పిన నాతఁడు నా మాటల వినెనా?

అసా—వినిన బాగుగనే యుండెడిది.

సద్గు—ఇప్పుడు వ్యవహార మెంతవఱకు వచ్చినదో చూచితివా?

అసా—ఈవృత్తాంతము నాతండ్రిగారికిఁ దెలియఁజెప్పిన యిక సురాజుద్దౌలాతోడ స్నేహ మొనరించునా?

సద్గు—ఏమో? ఆలోచింప నవాబుకంటె నీతండ్రియే దుష్టుఁడు; జ్ఞానహీనుఁడు.

[మతుబుచందు ప్రవేశము]

సద్గుణచందా! ఏమిచేయుచుంటివి?

సద్గు—ఎందులకు?

మతు—మఱేమియును విశేషములు లేవు.

అసా—జనకా! సురాజుద్దౌలాతోడ మైత్రితగదని చెప్పిన మా యిరువుర మాటలఁ బాటిసేయఁజాలవైతివి. ఇప్పుడు ముప్పు వాటిల్లినది.

మతు—(నవ్వుచు) అసామాన్యా! నీకిది యేమి! వెఱ్ఱియా! సురాజుద్దౌలా యంతటివాఁడు నాకు మిత్రుఁడై యుండ మన కేమిముప్పు వాటిల్లును?

సద్గు—అది మీ యుద్దేశ్యమే కదా!

అసా—జనకా! సురాజుద్దౌలా మిమ్ము మోసగించుచున్నవాఁడు.

మతు—కుమారీ! అటులెన్నటికిని జరుగనేరదు. నవాబునకు నాకునున్న మైత్రియే మీరు బాగుగా నెఱుంగరు. సురాజుద్దౌలాకు నాపైగాని, నాకుటుంబముపైగాని యమితప్రేమకలదు నవాబని పేరుమాత్రమే యతనిది కాని రాజ్యమంతయు నా చేతిలోనున్నది. నాతో చెప్పనిదే యాతఁడెట్టియుద్ధమునుగాని యెట్టిసంధియునుగాని యింక యెట్టికార్యమునుగాని చేయజాలఁడు. అసామాన్యా! ఇన్నియేల? పుత్రికవు కాన యీరహస్యము నీతోడఁ జెప్పుచుంటిని. సురాజుద్దౌలా యెప్పటికైన నేను చెప్పిన చొప్పున నడువనేసినవాఁడే.

సద్గు—నవాబు మీతోడఁ గపటస్నేహము చేయుచున్నవాఁడు. నామాటలు విశ్వసింపుఁడు.

మతు—సద్గుణచంద్రా! ఎటుల విశ్వసింపఁగలను?

అసా—సురాజుద్దౌలాపై నున్న నమ్మకము మా [illegible]?

సద్గు—నవాబు మిత్రద్రోహి.

మతు—ఎన్నటికిని కాదు. ఆతనిక న[illegible] బుద్ధియే లేదు.

సద్గు—లేదనియే మీ నమ్మకముగాని యాతఁడొనరించిన ద్రోహ కార్యమేదియో మీ రెఱుంగరుకదా?

మతు—సద్గుణచంపకా? సురాజుదౌలా నాయెడ ద్రోహముచేసి నాఁడా?

ఆ. వె. ప్రాణమిత్రుఁడతఁడు • పగవాఁడుకాఁడెంత
ద్రోహమేమిచేసె • దొడరినాకు?
తెలియఁజెప్పుమంత • తేటతెల్లంబుగ
గలఁత లడఁగు నాకుఁ • గలుఁగుసుఖము.

అసా—చెప్పరాని ద్రోహముచేసినాడు.

సద్గు—రహస్యమేమి? స్త్రీ వేషమున నీయింటఁజొఱఁబడి నీ కుమార్తెను బలాత్కారముగాఁ గొనిపోవఁజూచినాడు.

మతు—సద్గుణచంపకా! నా ప్రాణమిత్రుఁడగు సురాజుద్దౌలా యంతటి ద్రోహకార్యమునకు సాహసించెనే! నీయీమాటల మాత్రము నేను నమ్మఁజాలకున్నాను. నా పుత్రికను బలాత్కారముగఁ గొనిపోవ నాడు రూపమున నాయింటఁ బ్రవేశించినవాఁడూరక యేల వెడలెను?

సదు—అతఁడు చొరఁబడిన ప్రదేశమున కొక్క క్షణకాలము నేనాలస్యముగ వచ్చియుండిన యెడల. యాపని దప్పక చేసియేయుండును.

మతు—నీమాటలు నాకు వింతగానున్నవి.

అస్మా—మీకిప్పుడు వింతగానే యుండును.

మత్రు—నీవా ప్రదేశమునకుఁ జని యాతని నేమి చేసితివి?

సద్గు—ఏమిచేయవలయును? నా యీ చెప్పుతోఁదగిన బుద్ధి సెప్పి యాతని సాగనంపితిని.

మత్రు—(ఆశ్చర్యముతో) ఇంతపని నా యీ గృహమునందే జరిగినదా?

అసా—అవును.ఇక్కడనే జరిగినది కాని మీకింతయాశ్చర్యమెందులకు?

మత్రు—ఆశ్చర్యము కాదు కోపము వచ్చుచున్నది.

సద్గు—ప్రాణమిత్రుఁ డవమానింపఁబడియె ననియా?

మత్రు—అవును

అసా—(దగ్గరకు నేగి) జనకా! మీ హృదయము మాఱినది. మీ ప్రవర్తనలో ననేక మార్పులు కలిగినవి. మీ ప్రేమలో భేదము లగుపడుచున్నవి. ధర్మము మఱచితిరి. సత్యమార్గమునకు దూరమగుచుంటిరి. న్యాయము కాదు కదా. మీ జ్ఞానసంపత్తియు నడుగంటఁ జేసుకొనుచుంటిరి. భార్యాబిడ్డలను, బంధువర్గము, నిల్లువాకిలి, నిన్నియేల, లోకమునే మఱచితిరి. మీ సుఖజీవనమునకు మీరే బుద్ధిపూర్వకముగా నంతరాయములఁ గల్పించుకొనుచుంటిరి. సమస్తముఁ గుర్తెఱిగినవారలు మీరేయిట్టి యధోగతి పాలగుచుంటిరేమి? మీ సద్గుణసంపన్నత, మీ విద్యానైపుణ్యత, మీ ధీకౌశలత సర్వము నాశనమైనవా? మీ కీభ్రమ యేమి? నురాజుగ్గాలా మీ కెట్టి చుట్టము?

ఏ లాటిమిత్రుడు? రాజ్యమదాంధుఁడై ధర్మాధర్మము లెఱుఁగక, మంచి చెడ్డలఁ గుర్తింపకఁ గష్టసుఖములఁ బాటింపక, తనను దండించినవారలు లేరని విఱ్ఱవీగుచు, చెప్పరాని దుష్కార్యములను చేయుచు లోక శత్రువుఁడై ప్రవర్తించుచున్న యీ యాతురుష్క ప్రభుఁడు—కల్మషచిత్తుఁడు—దుష్ట దానవసముఁడు—జనకా! మీకాప్తమిత్రుఁడాయెనా? ఆ నవాబుతప్ప మీ కీలోకమున నెవ్వరు లేరా? అల్లారుముద్దుగట్టిననాటనుండియు నఱచేతులలోఁ బెంచి పెద్దదానినిగాఁ జేసితిరి. లేక లేకఁ గల్గిన బిడ్డయని బహు సుకుమారముగ బాలభానుని సైతము చూచిన నవ శిరీష ప్రసూన సమాన మృదుత్వము వహించిన యీ శరీరము వాడునేమోయను భయమున పసిఁడి మేడలఁ గ్రింద కాలిడ నీయక, యెట్టి పనినిఁ జేయనీయక యనేక దాసీజన మాదరించుచుండ హంసతూలికాశయ్యలపై యలరఁజేసి యెట్టి కొఱఁతయు లేక సాకితిరి—యీ మీ ముద్దులపుత్రికారత్నము నసానూన్యను మఱచుటయే కాదు, జనకా! కష్టములపాలు చేయుచుంటిరి కదా! ఆలోచింపరేమి? ఇంకను సురాజుద్దౌలాతోడ మైత్రియేనా? ఆమ్లేచ్ఛుఁడు మీతోడ సేయు మైత్రి కపటమని మీ రెఱుఁగరు కదా. మేము చెప్పి తగిన నిదర్శనములఁ జూపించుచున్నను నమ్మఁజాలకుంటిరి. మాకంటె నవాబుమీకేమి యెక్కువ? సురాజుద్దౌలా మీయెడ ద్రోహమొనర్చిన

మీకంత వింతగా లేదుకాని యాతని నవమానమన వింత యేకాదు మీకెంతయో కోపము జనించినది. మే మెట్టి యధోగతిపాలైనను మీకు సమ్మతమేకాని నవాబుతో మైత్రి మాత్రమువిడుచుట మీకు సమ్మతముగా లేదుకదా! జనకా! మాటలాడరేమి?

మతు—(విసుగుతో) ఇప్పుడీ స్వస్తి యెందులకు? ఏమిమాట లాడవలయును?

అసా—మీరటులనిన నేనేమిసెప్పెదను?

సద్గు—అవమానింపఁబడి వెడలిన నవాబు తన యీ క్రోధ మును నెటులయిన మనపైఁ దీర్చుకొనక యూరకుండునా?

మతు—ఊరకుండఁడు. మన మిక సేయునది యేమున్నది?

అసా—ఆతనితో మఱి మీమైత్రియేమి?

మతు—అసామాన్యా! మనకింత తర్జన భర్జన యెందులకు? ఈ విషమీదమాత్రము నవాబుతో నేను వైరముఁ బెట్టుకొన నొల్లను.

సద్గు—ఇక మీకు మేము చెప్పునదియే లేదు.

మతు—తప్పు మనయందుననే యున్నయది.

అసా—మీయుద్దేశ్య మిట్టులున్న యింకేమి? ఏమికానున్నదో యది యగును. కాని మీ బుద్ధి సూక్ష్మతకు—మీపరిపూర్ణ జ్ఞానసపరింపునకు— మీప్రవర్తనకు నేను మిగుల చింతించు చున్నదానను. జనకా! నమస్కారము. (అనినమస్కరించును)

మతు—వృథా కలఁత బడకుఁడు.

(అని నిష్క్రమించును)

అసా—నాథా!

తే॥ గీ॥ దుర్జనులమైత్రి విడదీయ • దుర్ఘటంబు
సజ్జనుల మైత్రి దొరకుటే • శ్రమకరంబు
దుర్జనులసేరి సజ్జనుల్ • తూఁగరాదు
సజ్జనులతోడ దుర్జనుల్ • సాగవచ్చు.

సద్దు—అవును. నీ తండ్రిగారి ప్రవర్తనకూడ నీ కిప్పుడు తెలిసిన దా?

అసా—సహవాసదోష మే!

సద్దు—అంతకన్న యింకనీవు మఱేమందువు?

తే॥ గీ॥ ఇతరులందునఁ బ్రీతివార • లెన్నుచుందు
రున్న లేకున్న దోసంబు • లెన్ని యేని
నైనవారిలో తప్పు లె • న్నేని యున్న
బట్టఁజాలరు సుంతయుఁ • బ్రజలు వసుధ.

అసా—ఇది లోక సహజమే లెండు.

(అనియిరువురు నిష్క్రమింతురు)

తెఱపడును.

---

## తృతీయరంగము.

---

[ముర్షిదాబాదునందలి రాజసౌధమునం గూర్చుండి సురాజుద్దౌలా యాలోచించుకొనుచుండును.]

ఈ యవమానమును నేనుభరియింపఁజాలను. భరియింపఁ జాలను. ముమ్మాటికి భరియింపఁ జాలను. మతుబుచ దిక నాకు మిత్రుఁడైనను శత్రుఁడైనను మఱేమియును భయము లేదు. సద్గుణచందుపై నాయీ క్రోధమును తీర్చుకొనకఁ బోవుదునా? తప్పకఁ దీర్చుకొనియెదను. అసామాన్యను బలాత్కారముగాఁ గొనివచ్చెదను. నన్నడ్డగించువా రెవ్వరు? నారాజ్యమునందు నాకెల్లరు శత్రువులైన నగుదురుకాక. నా సకల భోగభాగ్యము లడుగంటిన నడుగంటుఁగాక. సద్గుణచందుపై పగదీర్చుకొనుట యొకటి, యసామాన్యతో క్రీడించుటయొకటి తప్పక జఱుగ వలసిన క్రియలు. ముందు సద్గుణచందును చంపింపవలయును. ఇదియే కర్తవ్యము. (అని లేచి) ఎవరురా యక్కడ?

(భటుఁడు ప్రవేశించి)

చిత్తము మహాప్రభూ! ఏమియాజ్ఞ?

సురా — నీవు మతుబుచందు గృహమునకుఁ బోయి సాయం సమయములోపున నసామాన్యభర్తయగుసద్గుణచందును— ఎఱుఁగుదువా?

భటు— దేవా! ఎఱుఁగుదును.

సురా—ఆతని శిరముఁ ద్రుంపుకొనివచ్చి నాకు చూపవలయును. తెలిసినదా? ఇదియే నాయాజ్ఞ. శీఘ్రమే పొమ్ము.

(అని లోపలకుఁ బోవును.)

భటు—(ఆశ్చర్యముతో) ఈ క్రూరాత్మున కిదియేమి బుద్ధి? మఱియుచం దీతనికి ప్రాణమిత్రుఁడు. ఆతని యల్లుఁడే కదా సద్గుణచందు. సద్గుణచం దీతని కెట్టి శత్రుఁడు? మఱియుచందు నకు సురాజుద్దాలా కిప్పుడేమి వ్యవహారములు చెడినవో కదా! కానిమ్ము. నాకీ యాలోచన యెందులకు? శీఘ్రమే పోయి ప్రభువాజ్ఞ నిర్వర్తింపవలయును.

(అని నిష్క్రమించును.)

---

## చ తు ర్థ రం గ ము.

---

[ముర్షిదాబాదునందలి రాజసౌధములోఁ గూర్చుండి సురాజుద్దాలా, భటుఁడు సంభాషించుకొనుచుందురు.]

సురా—సేవకా! ఏమిచేసుకొని వచ్చితివి?

భటు—దేవా! మీ యాజ్ఞానుసారముగా సద్గుణచందు శిరముఁ ద్రుంపుకొని వచ్చితిని. (అని సద్గుణచందుశిరము న:ాక పళ్ళెరమునందుంచి నవాబుయెదుటఁ బెట్టును.)

సురా—(సంభ్రమముతో) సేవకా! మంచిపనిఁ జేసితివి. నా క్రోధాగ్ని యిప్పుడు చల్లారినది. ఈపని నీవెప్పుడు చేసితివి?

భటు—మీరు నా కాజ్ఞాపించిన తక్షణమేపోయి చేసితిని.

సురా—నీవు మతుబుచందు గృహమునకుఁ బోవునప్పటికి సద్గుణచం దేమిసేయుచుండెను?

భటు—ఏమియును సేయుట లేదు. ఒక్కఁడు కూర్చుండియుండెను. మతుబుచందుకాని, యాతని భార్యకాని, యసామాన్యకాని యింక మఱెవ్వరందు లేరు.

సురా—ఎవ్వరును లేరా? ఎక్కడకుఁబోయియుందురో నీవెఱుఁగుదువా?

భటు—నే నెఱుఁగను.

సురా—సరి! వేగిరమే నీవీ శిరము నీపళ్ళెరమున నేయుంచి తీసుకొనిపోయి యసామాన్యకు, మతుబుచందునకు, నాతని భార్యకు, బంధువర్గమునకు మిత్రసంతతికి చూపుము.

భటు—చిత్తము. అటులనే చేసెదను.

సురా—అంతియేకాదు. ఈ మూర్తి దాబాదునకంతకు చూపవలయును. ఈ కార్యము తనకు జరిగిన యవమానమునుఁగూర్చి సురాజుద్దాలా కావించి తన క్రోధాగ్నిని చల్లార్చుకొనియెనని యెల్లరకు విశదముగా చెప్పుము. ఇకనైన యా యసామాన్య నవాబుకోర్కెఁ దీర్చునో తీర్పదో తెలిసికొనిరమ్ము. మతుబుచందుతోడ సురాజుద్దాలా యిక నాతనికి బలవద్విరోధి యాయెనని చెప్పుము. సేవకా! శీఘ్రము మే పొమ్ము.

భటు—చిత్తము. (అనిపోవుచు మెల్లగా) భగవన్నిర్మాణము లతి చిత్రములు.

(అని నిష్క్రమించును.)

సురా—ఇప్పటికికదా నాయాత్మ శాంతిపడినది. ఇకనైన నసామాన్య నాకోర్కెఁ దీర్పకుండునే! కానిమ్ము. చూచెదఁగాక.

(అని లోపలకుఁబోవును.)

(తెరపడును.)

---




# అసామాన్య

## తృతీయాంకము—ప్రథమరంగము.

[ముర్షిదాబాదు నందలి సౌధమునఁ గూర్చుండి మతుబుచందు దుఃఖించుచుండును]

ఆహా! సురాజుద్దౌల్యా యెట్టి ఘోరకార్యమునకు సాహసించినాడు! నవాబుతో నీకు మైత్రితగదని సద్గుణచందు కాని యసామాన్యకాని యెంతచెప్పినను విననైతినికదా! నాకొంప కింత నేనే తెచ్చుకొంటిని. సద్గుణచందా! ఆ క్రూరాత్ముని చేతిలో నీకిట్టి యకాలమరణ మున్నదికాఁబోలు! విధికృతములు జగన్నింద్యములుకదా! తనయా! అసామాన్యా! నీకెట్టి దుస్థితి సంభవించినదే! ఈ యీడునకే నీకీ వైధవ్యగీతయొక్క డాచతురాననుఁడు వ్రాసెనోకదా! కుమారీ! యిక నీ త్రిజగన్మోహన మైన సౌం

దర్యమంతయు నేమి పాలుజేసెదవు? అయ్యో! నాకీదుఃఖమెట్లు లడఁగును? సురాజుద్దౌలాతోడ నేను మైత్రి యిందులకే కాఁబోలు చేసితిని.

(అని దుఃఖించు చుండును.)

[అసామాన్య ప్రవేశించి దుఃఖముతో]

జనకా! నాకేమిదారి? నా కాపురమున కెట్టిస్థితి తెచ్చి పెట్టితిరి. నవాబుతోడ మైత్రివలదని చెప్పిన వింటిరా? మీ మిత్రుని యిప్పుడేమి చేసెదరు? మీ కాతఁడింక మిత్రుఁడేనా? శత్రుఁడా? శత్రుఁడేయైనమాత్ర మేమి సేయఁగలరు? నవాబు మిమ్ము మోసగించుచున్న వాఁడనిఁ జెల్పిన మాయందుకాని, మా మాటలయందుకాని మీకిసుమంతయైన నమ్మకము కలుఁగదాయెనే! ఇప్పుడైన కలిఁగినదా? మాటలాడ రేమి? సురాజుద్దౌలా పేరునకుమాత్రమే నవాబని యంటిరే! మీతో ముచ్చటింపకయే యాతఁ డెట్టి కార్యమును చేయఁజాలఁడంటిరే! అతని రాజ్యమంతయు మీ యరచేతిలోననే యున్నదనియంటిరే! జనకా! మీశక్తియెట్టిదో, మీ యధికారమెంతదో, మీయుక్తి మైత్రియేలాటిదో నాకిప్పుడైనఁ జూపఁగలరా? నవాబుతోడ మైత్రిమనకెట్టి ఫలితములఁ జేకూర్చినదో తెలిసికొంటిరా? ఇప్పుడైన సురాజుద్దౌలా యోగ్యతకాని, యాతని తలఁపులుకాని, యాతని ప్రవర్తనకాని మీకు తెలిసినదా? తండ్రీ! బుద్ధిపూర్వకముగా నన్నెట్టి యధోగతిపాలు

చేసితివి? మాకపూర్వ విపరీతబుద్ధులు జనియించుటకుఁదోడు భగవానుఁడనుకూలుఁడైన విషయము నే నెఱుఁగనైతిని. అయ్యో! నానాథుని స్థితి తలఁచుకొనుచున్న నాగుండె బ్రద్దలగుచున్నది. అదేమి భయమోకాని—తద్భయముచే నా మేను కంపితమగుచున్నది. నాహృదయము పరిపరివిధముల కలఁతఁ జెందుచున్నది. నాదుఃఖము పొంగి పొరలివచ్చుచున్నది. ఏమి సేయుదును? తండ్రీ! తండ్రీ!—

(అని కౌఁగిలించుకొనును)

(భటుఁడు సద్గుణచందు శిరమును పళ్ళెరమునఁ బెట్టుకొని ప్రవేశించును.)

మతుబుచందున కపూర్వ శత్రుఁడగు ముర్షిదాబాదు నవాబు—సురాజుద్దౌలా గారియాజ్ఞ. దుస్సహమైన వారి యవమానమునుఁగూర్చి సద్గుణచందుపై కలిఁగిన క్రోధాగ్నినిఁ జల్లార్చుకొనుటకుగాను చేయించిన ఘోరకార్యము.

మతు—ఓరీ! ద్రోహీ! ఎంతపని చేసితివిరా! అయ్యో! ఎంత ఘోరము! నేను చూడఁజాలను. నేనిక బ్రదుకఁగలుగుదునా? బ్రతుకఁగలుగుదునా? బ్ర-తు-క-గ-లు-గు-దు-నా?— అయ్యో! కుమారీ! కుమారీ! కు-మా-రీ!—

(అని మూర్ఛిల్లును.)

అసా—(దుఃఖముతో) ఏమిసేయుదును. నా జీవితేశ్వరుని శిరము.....అయ్యో! మాట రాకున్నది. ఏమియుఁ

ద్రోచుట లేదే! నానాఘుడు నవాబున కేమి విసముపోసెను. అతనికింత క్రూరత్వమేల? నాథా! యీ నిర్భాగ్యురాలి కేమిచెప్పితిరి? సకలభోగ భాగ్యములకు నెట్టి కొఱంతయు లేక సుఖముగ జీవించుచున్న నాకు, దైవమా! యెట్టి యిక్కట్టులఁ గూర్చితివి? మా యనుకూల దాంపత్యమును చూచి సహింపఁజాలక పోతివా? ప్రాణేశ్వరా! విద్యు త్కాంతు లీను నీముఖారవిందమిప్పు డీ పర్యైరమునఁజూడ నాగుండెబ్రద్దలయి పోవుచున్నది.నాకనులు తిరిగిపోవుచున్నవి. నా చూపులు మారుచున్నవి. నాహృదయమున నగ్ని జ్వాలలు జనియించుచున్నవి. దుఃఖముపొంగి పొరలివచ్చు చున్నది. నా శరీరము కంపమెత్తుచున్నది. ఇక క్షణకాల మైన నిలువఁజాల. మనోహరా! మనోహరా!......

ఏనాడు సురాజుద్దౌలా నవమాన పఱచితిరో యా నాడే కదా మన కేదియో కీడుకలుఁగక మానదను తలఁ పొకఁటి నా హృదయమున నాటుకొనినది. యా నాటినుండియే కదా మన సుఖజీవనమున కాటంకములు రాఁదొడంగినవి. యా నాటినుండియేకదా చెప్పఁజాలని వేదన నా చిత్త మును కలఁతపెట్ట సాగినది. ఇన్నియునాకు సంభవించుట యీ విపత్తునకే కాఁబోలు! జీవితేశ్వరా! యిక యీ లోకమున నే నుండఁజాలను. ఉండఁజాలను. ముమ్మాటికి నుండఁజాలను. (అని మూర్ఛిల్లును.)

భటు—అయ్యో! వీరి కెట్టి దుస్థితి సంభవించినది! కారణ మా
నవాబు సురాజుద్దౌలా యేకదా! ఎంతపాపాత్ముఁడు!

తే॥ గీ॥ ప్రముఖ దుర్గుణ తేజుండు • ప్రభుఁడైయైన
తీవి రేలఛత్రంబుఁ బ • ట్టింపలేడె?
కాలసర్పంబునకు వేడ్కఁ • బాలుపోయ
మిగుల క్రూరతలోకంబు • మ్రింగ లేదె?

ఎటులయిన సురాజుద్దౌలాకు చెడురోజులు దగ్గరకు
వచ్చినవి.

(అని నిష్క్రమించును)

తెఱపడును.

---

# ద్వితీయరంగము

---

[ముర్షిదాబాదు నందలి రాజ సౌధమునఁ గూర్చుండి సురాజు
ద్దౌలా యాలోచించుకొనుచుండెను.]

ఎప్పటికైన ప్రభువునకు ప్రజలు లొంగి యుండవలయును.
ఎట్టి విషయములందైన ప్రభువున కధికారము స్వాతంత్ర్య
మున్నదికాని ప్రజలకు లేదు. తనయింటఁ బ్రవేశించినంత మాత్ర
మున నాస్థితిగతుల పూర్ణముగ నెఱిఁగియు సద్గుణచందు న
న్నవమానపఱచి తుద కెట్టి శిక్షయనుభవించినాడు! మఱియుచందు
నకు నాకును పూర్వ మెంతమైత్రికలదో యిప్పుడంత శత్రుత్వ

మేర్పడినది. అయిన నాకేమి భయము? నాక్రోధాగ్ని చల్లారి నాయాత్మ శాంతి వహించినదే కాని యసామాన్యతోఁ గ్రీడించు భాగ్యమింకనైన నాకు లభించునో, లభింపదో యను చింత మాత్రము నన్ను పూర్తిగఁ గ్రుంగజేయుచున్నది. అచిరకాలములో నాకోర్కె నాకు తీరునెడల ధన్యుఁడనే! మన్మథతాపము ప్రబలమైనది. అస్థిమితమగు బుద్ధియేర్పడినది. ఇంకయేమి చెప్పుదును?

తే. గీ. నీరమునుఁ ద్రావనొల్లయా • హారమంద
యిష్టముజనించె, నిదురరా • దెంతరేలఁ
బత్నులనుసేరి సరసము • ల్బలుకజాలఁ
బృథివినాకాంతపై నున్న • ప్రేమకతన.

తే. గీ. ఎప్పుడా నీరజాక్షిని • యెలమిఁబట్టి
నాదుకోర్కెలఁ దీర్చుకొ • నంగఁగలనొ
యప్పుడేనాకు లభియించి • నట్లు స్వర్గ
మింకనీజన్మమున; కిన్ని • యేలపలుక?

తే. గీ. ఆపడఁతియొయారంబు, లా • రూపురేఖ,
లావిలాసము, లాహాయి • లానడకలు
నాకనులు నాముఖాబ్జము • నంతజూచి
యెవఁడు మోహాబ్ధిలోమున్గఁ • డవనిమీఁద?

ఆలలనాశిరోమణి నాకనుల యెదుట నహర్నిశము సాక్షాత్కరించినట్లయగ్లేయుండునుకదా? ఆకల్యాణినెటులచేబట్టఁ గలను? (ఆలోచించి) కానిమ్ము. చూచెద.

(అని నిష్క్రమించును.)

---

## తృ తీ య ర ం గ ము.

---

[ముర్షిదాబాదునందలి సౌధమునఁ గూర్చుండి మతుబుచందు దుఃఖించుచుండును.]

అయ్యో! యీపుత్రికారత్నము దుస్థితిచూచి నేనెట్లు సహింపగలుగుదును? భర్తగతించినను యన్నవస్త్రాదులకు మఱే మియుఁ గొఱఁతలేదుకదా? కొన్నినాళ్లకయిన యీదుఃఖమును మఱచి సుఖముగ జీవింపదాయను నాయొక్కయాశకూడ యడు గంటినది. క్షీణచంద్రునివలె ఈతనయనానాటికిఁ దేజోవిహీనయ గుచున్నదికదా! అన్నమునుకుడువదు. నీరమైనఁ ద్రావదు. నిదు రఁబోజాలదు. తల్లితండ్రులతోఁ బలుకనొల్లదు. సఖీజనంబుల తోనైనఁ గూరిమిఁ గాలముగడుపదు. ఎంతమంది వైద్యులరప్పిం చినను వ్యర్థముగ ధనవ్యయమగుటయే కాని యెక్కడైనా వ్యాధియిదియని నిర్ణయింపఁ జాలఁడాయె. ఇదినాభ్రమయేకాని కర్మఫలమునకు వైద్యులేమి సేయగలరు?

తే. గీ. ఉదరపోషణార్థంబు బ • ల్మదముతోడ
మహింభిషగ్వేషధారులై • మనెడువారు
ప్రజలకర్మఫలముల నే • భంగిఁదొలఁగ
సేయగల రిది భ్రమకాక • జీవులకును.

వైద్యులపైన నాకునమ్మకము తగ్గినది. నాతనూజవ్యాధి యే వైద్యుడును కుదర్పజాలఁడు. అదివ్యాధియేనా? కాదు. ఉన్మాదము జనించినది. ఇది యెట్లుకుదురును?

(అని యూరకుండును)

[రామప్రియాజీ ప్రవేశము]

మతుబుచందుగారూ! —

మతు—మిమ్ముల నేనెఱుఁగను.

రామ—ఎఱుఁగకఁబోవచ్చును. నాది కలకత్తానగరము.

మతు—తమ నామధేయమేమి?

రామ—రామప్రియాజీ.

మతు—నాతోఁబనియుండి వచ్చితిరా?

రామ—అవును. తమకుమారి యనివార్యమగు వ్యాధిచేఁ బీడింపఁబడుచున్నది కదా?

మతు—అవును. ఆవ్యాధి యనివార్యమని నీకెప్పుడు తోచినది? తమయుద్దేశ్యముకూడ నంటియేనా?

రామ—కాదు, కాదు. ఆవ్యాధిని వారణ యగునుగాని బహు కష్టతరము.

మతు—రామప్రియాజీ! అదివ్యాధియని మాత్రము నేనునమ్మ జాలను. నాతనయ కున్మాదము జనించినది.

రామ—కానిండు. ఏదిద్దైనను నివారణయగును.

మతు—ఆనమ్మకము నాకునశించినది.

రామ—మతుబుచందుగారూ! మీకెట్టిసంశయమువలదు. నేను కూడవైద్యుఁడనే. మీకుమార్తె వ్యాధి నివారణసేయు భార మునాయదికాని మీఱొకపని చేయవలసియుండును.

మతు—నాకుమార్తెను మీరుకాపాడగలరా? ఆదైర్యము మీకున్నదా?

రామ—నాకుధైర్యముకలదు. మీకుమార్తె కీస్థితి దెచ్చిపెట్టిన యాతఁడు సురాజుద్దౌలాకదా? అతఁడు మీయల్లుడగు సద్గు ణచందుశిరము ఖండింపఁ జేయుటయేకాక తచ్ఛిరముఁ బళ్ళె రమునఁ బెట్టించి భటునిచే ముర్షిదాబాదున కంతకు దన సాహస కార్యమునుఁ దెలియచేయించిన పిమ్మట నా పళ్ళె రమును మీకు మీకుమార్తెకునుఁ జూప నాపె భర్తపై ప్రేమచే దుఃఖమును పట్టఁజాలక యిట్టియున్మాదములోఁ బడెను. ఎట్టివైద్యశిఖా మణివచ్చిన వ్యాధి నివారణ సేయఁ జాలఁడు కదా, యిట్టిదని వ్యాధినిఁగూడ గు్రిం పఁ జాలడు. వైద్యులకీవ్యాధి దుస్సాధ్యమయినదే. ఎట్టిమందులు పనిఁ చేయజాలవు. నేనుచెప్పినచొప్పున మీరువర్తింతురేని తప్పక

మీాతనూజ వ్యాధి నశియించును. మతుంబుచందుగారూ! ఏమి మీాయాలోచన?

మతు—రామప్రియాజీ! ఆలోచనమతేమియును లేదు.

రామ—నామాటలయందు మీాకునమ్మకము లేదా?

మతు—కానిమ్ము, నీమాటలుగూడ వినెదను. నాపుత్రికారత్నము వ్యాధి నివారణకై నేను చేయవలసిన పనియేమి?

రామ—చెప్పుమందురా? సురాజుద్దౌల శిరముఖండించి మీా కుమార్తెకుఁజూపినయాక్షణమేయాపెవ్యాధినివారణయగును. మీాకెట్టి యనుమానమువలదు. సాహసించి వేగిరమే యీాపని జేయింపుఁడు.

మతు—(ఆశ్చర్యముతో) రామప్రియాజీ! నీయాలోచన కొంత వఱకు బాగుగనేయున్నది. ఇదివఱకువచ్చియుండిన వైద్యులలో నాకొక్కఁడైననిట్టి యాలోచన చెప్పియుఁడలేదు. ఏల నోకాని నీయాలోచన నాకుసమ్మతముగానే యున్నది. లోనికిఁ బోవుదముఁరమ్ము.

(అనియిరువురు లోపలకుఁ బోవుదురు)

తెర పడును.



శ్రీ ర స్తు.

# సు రా జు ద్దౌ ల

లే క

# అ సా మా న్య

చతురాంకము—ప్రథమరంగము

[ముర్షిదాబాదునందలి రాజసౌధమునఁ గూర్చుండి సురాజుద్దౌల, బేగము మాట్లాడుకొనుచుందురు]

సురా—ప్రేయసీ! మనకు కష్టదినములు వచ్చినవి.

బేగ—మీకిప్పటికి తెలిసి వచ్చినదా? రానిండు. ఏమిచేయఁ గలుగుదుము?

సురా—ఇక మన మీగ్రామమందున్న ప్రాణములు దక్కవు. అర్ధరాత్రమున లేచి యెవరికిఁ దెలియకుండ యెక్కడకైన బోవలసిన దే!

బేగ—(దుఃఖముతో) అయ్యో! కష్టదినములన నిట్టివా? నే నన్యథాతలఁచితిని. ప్రాణేశ్వరా! మీరు ప్రభువు లేకదా!

సురా—(దుఃఖముతో) మనోహారీ! నేను ప్రభువుననుమాట వాస్తవమే కాని, యేనాడు నా నిరంకుశపరిపాలనలో నా ప్రజల నందరిని తగిన నిర్బంధనలతో నుంచ గలిగితినో, యేనాడు నాశత్రుకోటికి నాపేరు వినుటయే సింహస్వప్నముగ నుండవర్తిలితినో, యేనాడు నాసామంతులఁగలలలో నేని నా యాజ్ఞల నుల్లంఘింపక విధేయులై యథావిధిఁ గప్పములఁ జెల్లింపఁజేయఁగలిగితినో, యేనాడు సకలభోగభాగ్య భాస్వతుఁడనై, యవక్రపరాక్రమ సంపన్నుఁడనై, దిగంతయశః ప్రాభవుఁడనై, యనుపమేయబలసాహస శౌర్యధైర్య ధుర్యుఁడనై ధరణీచక్రమును పాలించి యుంటినో యానాఁడే కదా నేను ప్రభువును. కల్యాణీ! కాలము మూరినది. శత్రువులు ప్రబలిరి. నాయాజ్ఞ కాదు కదా, నా ప్రార్థనలనైన వినెడు వార లీ ముర్షిదాబాదునందున లేరు మనలఁజూచిజాలివహించెడు వారలు లేరు. మనల నిక్కడ కష్టములయందు నాదుకొనువారలు లేకఁ బోవుట యటుండ, నే యర్ధరాత్రముననో రహస్యముగఁ జంప నీముర్షిదాబాదంతయు నాలోచనలు సల్పుచున్నయది. బ్రతికియుండిన బలుసాకు తిని జీవింపవచ్చును! ప్రాణేశ్వరీ! యీ యర్ధరాత్రిముననే యెవరికి దెలియకుండఁ బలాయనమగుదము. ఇందులకు నీ యభిప్రాయమేమి?

బేగ—(దుఃఖముతో) హృదయేశ్వరా!

తే॥ గీ॥ ఎలమి రాజ్యమదాంధత • నెంతమున్న
మిన్నుగానక మెలఁగుట • కొన్నినాళ్ళు
కూటిగుడ్డల కేలేకఁ • గొన్నినాళ్ళు
భువినియెప్పటి కేభోగ • మెవరి కెఱుక?

నేను మీయాజ్ఞానుసారముగాఁ బ్రవర్తించుదాననే కదా!

సురా—(దుఃఖముతో) జీవితేశ్వరీ! చారుశిరీష ప్రసవ సమాన కోమల మృదుత్వమును వహించిన యీ నీ పదియార్వన్నె పసిండి చాయఁగల శరీరమును నన్నుఁగూర్చి కష్టపెట్టుదువు కాఁబోలు! ఎండ కని విని యెఱుఁగక పైడి మేడలందున హంసతూలికా పాన్పులపై నలరుచు, రాజాన్న భోజనసంతుష్టిచే హాయిగ, దాసీజనసపర్యలు జరుగుచుండ కాలము గడుపుదానవు, నన్నుఁగూర్చి యెండవానలనక, కటికి నేలలఁ గడుబడలి కాలిప్రయాణము లొనర్చుచు, ఘోరశిలా కంటక భూములఁ బవ్వళించుచు, దేశదేశంబుల గ్రాసములఁబడి దొరకిన కూటితో వృత్తివహించుచు శత్రుజనంబులు పైఁబడుదురేమో యను వెఱపున నికఁగాలముఁ గడుపుదువు కాఁబోలు! నిందు చూలాలవు. నీకెట్టి కష్టదినములఁ దెచ్చి పెట్టితిని దైవమా!

చేగ—మనోహరా! దుఃఖించు టెందులకు? బుద్ధిపూర్వకముగా దెచ్చుకొన్నయప్పు డెట్టికష్టముల నెవరైన ననుభవింపక దప్పునుకదా!

సురా—అవును. సర్వమున కాభగవానుఁడే కలఁడు.

బేగ—భగవానుఁడేమి సేయును? ఇవి మన కర్మఫలములని తెలిసికొనుఁడు.

సురా—ఈరాత్రికే బయలుదేరి రహస్యముగా దగ్గరనున బాగో బంగాళాయను గ్రామము సేరుదము. అందు మనము సుఖముగ జీవనము సేయవచ్చును.

బేగ—అటులనే కానిండు.

(అని యిరువురు లోపలకుఁబోవుదురు)

తెఱ పడును.

---

## ద్వితీయరంగము.

---

[బాగోబంగాళాయందలి నొక కుటీరమునఁ గూర్చుండి సురాజుద్దౌల, బేగము మాట్లాడుకొనుచుందురు]

సురా—జీవితేశ్వరీ! మనము బయలు దేరివచ్చిన వేళావిశేషము మంచిది.

బేగ—ఇంతవఱకు బాగుగనే యున్నది.

సురా—భగవంతుఁడు మనపాలిఁటనున్నవాఁడు.

బేగ—ఇంతకు నీపుట్టిన పసికూన యదృష్టవంతురాలు

సురా—అవును.

తే॥ గీ॥ పెక్కుచిక్కులఁ గలిఁగిన • బిడ్డయిద్ది
నీదు మాట ప్రకారము • నెలఁతనిన్ను
విందుగ నదృష్టమే దీని • కుండెనేని
ముదముతోఁడ రాజ్యంబు సే • రుదును మరల.

బేగ—బాగుగనే యున్నది. అది యేమి మాట? ఈబిడ్డమన కుద్భవమైన కతమున గర్భశత్రువు లెల్లరు మీకా ప్తమిత్రు లగుదురా? మీరాజ్యము మఱల మీరు సేరుదురా?

సురా—కానిమ్ము. దాని యదృష్టమెట్లున్నదో.

బేగ—ఇది దురదృష్ట జాతకురాలే యనుకొనుఁడు.

సురా—ఈప్రసంగముల కేమిలే. మన మీ కుటీరము ప్రవేశించుట యెవరికిని తెలియదుకదా.

బేగ—ముర్షిదాబాదు జనుల కెవ్వరికిఁ దెలియదని తలఁచెదను.

సురా—బాగో బంగాళాయందున్న నీ కుటీరవాసుని కొక్కనికిఁ దక్క యింకెవరికిఁ దెలియదు. తెలిసినమాత్రము మన మింకఁ బెక్కు చిక్కులలోఁ బడుదుము.

బేగ—ఇంటనున్నవానితో మనవిషయ మెవ్వరికిని తెలియనీయ వలదని గట్టిగా చెప్పుఁడు.

సురా—ప్రప్రథమముననే చెప్పితిని. అయినను మరలచెప్పెదను.

బేగ—మన బ్రతుకు నేటికిట్టిది కావలసి వచ్చెనుకదా!



సురా—భగవచ్చిత్రములు!

(అని యిరువురు లోపలకుఁ బోవుదురు)

తెఱపడును

---

## తృ తీ య ర ం గ ము.

---

[ముర్షిదాబాదునందలి రాజసౌధ సమీపమున భటుఁ డాలోచించుకొనుచుండును.]

'సురాజుద్దౌలా శిరము ఖండించి తెచ్చి చూపిన యసామాన్య వ్యాధి నివారణయగునని' రామప్రియాజీ యనునొక కలకత్తా వైద్యుఁడు మతుబుచందునకుఁ జెప్పినాఁడఁట! ఆకార్యము చేయుట కసమర్థుఁడై మతుబుచందు తన తనయవ్యాధి కుదుర దను యధైర్యమున మిగుల దుస్థితిలోనున్న వాఁడు. బాగుగ విచారింప యీకాపురమునకిట్టి దుస్థితిఁ దెచ్చి పెట్టినయాతఁడొక్క సురాజుద్దౌలాయే కాదు నేనుకూడ భాగస్థుఁడనే. కాన యిప్పుడు నాయీ పాపహారణమునకై మతబుచందునకు సాయమొనర్చె దను. నవాబు యాజ్ఞానుసారముగా సద్గుణచందు శిరమును ఖండించి యసామాన్యయెదుటఁ బెట్టి యీ సాధ్వీమతల్లికిట్టి యని వార్యమగు వ్యాధిని — అది వ్యాధికాదు. ఉన్మాదము— దెచ్చిపెట్టిన పాపాత్ముఁడను నేనే. ఇప్పు డసామాన్య ప్రాణ రక్షణార్థమై సురాజుద్దౌలా శిరము ఖండించితెచ్చి యీపెకుఁ

జూపవలసినవాఁడను నేనే. నవాబు భార్యతోఁగూడ బాగోబంగాళా యందున్నట్లు నాకు తెలసినది. శీఘ్రమే యక్కడకుఁబోయి నేనీ కార్యమును చేసుకొని వచ్చెదను.

(అని నిష్క్రమించును.)

(తెఱపడును)

---

## చతుర్థరంగము.

---

[ముర్షిదాబాదునందలి సౌధమునఁ గూర్చుండి యసామాన్య యాలోచించుకొనుచుండును.]

నాకేదో వ్యాధి జనించినదని నాతండ్రి మితిలేని ధనము వ్యయముసేయుచు ననేకమంది వైద్యులఁ బిల్పించుచున్నవాఁడు. రామప్రియాజీ యనునొక కలకత్తావైద్యుఁడువచ్చి సురాజుద్దౌలా శిరముఁ ద్రుంచి తెచ్చి చూపినఁ గాని నాకీ యున్మాదము కుదురదని చెప్పినాడఁట! ఇప్పుడు నాతండ్రి యాప్రయత్నముమీద నేయున్నవాఁడు. ఈనిర్భాగ్యురాలిమూలమునఁ బాపాత్ముఁడు—నాకు పగవాఁడైనమాత్ర మానవాబు చంపఁబడుట యెందులకు? నిండు చూలాలగు బేగముతోఁగూడ సురాజుద్దౌల దేశముల పాలయి పోయినాడనియు, నిప్పుడీముర్షిదాబాదునకుమీర్జాఫరను నాతఁడు ప్రభుఁడాయెననియు వినియుంటిని. నిండు చూలాలయ్యు పడలేని శ్రమలఁ బడుచు పతినే నమ్ముకొని యాతని వెనువెంట నే

తిరుగుచున్న యీ సాధ్వీరత్నమునకు నాకువలెనే వైధవ్యము దెచ్చిపెట్టుటమాత్రము నా తండ్రికి శ్రేయస్కరముకాదు. నన్ను గూర్చి యొకరు దుఃఖములపాలగుట నాకు సమ్మతము కాదు.

(అని యూరకుండును.)

[మతుబుచందు ప్రవేశించి]

కుమారీ! యొకసారి వెలుపలకు వచ్చెదవా?

అసా—ఎందులకు?

మతు—అమ్మా! రాఁజాలవా?

అసా—రాఁగలుఁగుదునుకాని యెందులకో చెప్పరాదా?

మతు—రమ్మ. చెప్పెదను. (ఇరువురు నిష్క్రమింతురు.)

(తెఱవాలును.)

---

## పంచమరంగము.

---

[ముర్షిదాబాదునందలి మతుబుచందు సౌధప్రాంతమున సురాజుద్దౌలా శిరము నొక బల్లెమున గ్రుచ్చి భటుఁడు పట్టుకొని యుండును. అసామాన్యా మతుబుచందు ప్రవేశింతురు.]

అసా—(ఆశ్చర్యదుఃఖములతో) తండ్రీ! ఆ నిర్భాగ్యుఁడెవఁడు?

మతు—(సంభ్రమముతో) కుమారీ! మన శత్రువుఁడు సురాజుద్దౌలా.

శసా—(దుఃఖముతో) తండ్రీ! ఎంతపాపమునకుఁ బాల్పడితిరి! ఇందుమూలమున మనకుఁ గలిఁగిన లాభ మేమి? నావ్యాధి నివారణమై నేను బ్రతికిన యేమి ప్రయోజనము? ఈ యప నింద నేను మోయఁగలనా? అయ్యో! నిండు చూలాలగు బేగమింక బ్రతుకునా? ఈ పాపిష్ఠిదానిఁగూర్చికదా మీరిట్టి దుష్కృత్యములకుఁ బాల్పడితిరి. జనకా! నావ్యాధి నశియించినది. నా యున్మాదము కుదిరినది. లాభ మేమి? కార్యసంఘటనలయం దాలోచన వలదా? ఎంతగొప్పవారలైన నేమి? వైద్యులు చెప్పెడు పనులెల్ల చేయవలసినవా? అయ్యో! మిత్రులనైననేమి శత్రులనైననేమి కష్టదశయం దున్నప్పుడు కాపాడవలయునుకదా! సమస్తము నెఱిఁగినవారలయ్యు నింత యజ్ఞానములోఁబడితిరేల? (భటునివంకఁ జూచి) ఓరీ! పాపాత్ముఁడా! నా జీవితేశ్వరుని చేతులార చంపినవాఁడవు నీవు. ఆపాపము చాలకయేనా యిప్పు డీనవాబునుకూడ చంపితివి. ఛీ! హంతకా! దూరముగఁబొమ్ము. నీ మొగముఁ జూచిన పాపము పైఁబడును.

భటు—అమ్మా! కోపము వలదు. నేను పాపాత్ముఁడనను మాట వాస్తవము. నవాబగు సురాజుద్దౌలాను గూర్చి మీభర్తను నేను చేతులారచంపి మీ కనివార్యమగు వ్యాధినొందు రాజేసితిని. తన్నివారణకై యిప్పుడీ కార్యమును చేసితిని. ఇక నాయీ కృత్యము మీ రెట్లుగాఁదలఁచినను నాకు సమ్మతమే.

అసా—ఓరీ! యింక నిలువఁబడి సిగ్గులేక మాటలాడెద వేల? నీ పాపముల కంతము లేదు. ఫలము లనుభవించెదవు. పొమ్ము.

(అని లోపలకుఁ బోవును.)

మతు—నా దుఃఖ మడఁగినది. నవాబుపై నాక్రోధము తీరినది.

భటు—అయ్యా! వెళ్ళెదను.

మతు—మంచిది.

(భటుఁడు నిష్క్రమించును.)

మతు—ఈ భటునకీపని యెవరు సెప్పియుండిరో కదా! సాహసించి చేసినాఁడు. నా తనయ వ్యాధికాని, యున్మాదముకాని యడఁగినట్లేయని తలఁచెదను. పోయి విచారించెదను.

(అనిలోపలకుఁ బోవును.)

(తెఱపడును.)

---

శ్రీరస్తు.

# సురాజుద్దౌల

లేక

# అసామాన్య.

పంచమాంకము—ప్రథమరంగము.

---

[ముర్షిదాబాదు నందలి సౌధమునఁ గూర్చుండి యసామాన్య యాలోచించు కొనుచుండును]

సురాజుద్దౌలాకు సంబంధించిన వారలతో నెట్టి మైత్రి యొనర్పించినను జనులు కఠినశిక్షలకుఁ బాత్రులగుదురని మీర్జాఫ రాజ్ఞాపించియున్న వాడే కాని తదాజ్ఞ నుల్లంఘించుట కిప్పుడు నేను సంసిద్ధురాలనై యున్నదానను ఎట్లన—

ఆ. వె. తోడునీడ లేక • దుర్గతిపాలాయె
నల నవాబుపత్ని, • యన్నవస్త్ర
ములకుఁ గొఱఁతకలిఁగె • ముదమార వేవేగఁ
బోయి కాతు నాపెఁ • బూర్ణకరుణ.

ఇందుమూలమున మీర్జాఫరు నాకెట్టి శిక్షవిధించి

నను విధించుఁగాక! కష్టదశలోఁ గనిన బిడ్డతోఁగూడ నా నిర్భాగ్యురాలు బాగో బంగాళాయందే కాలముఁ గడుపు కొనుచుండి యుండవచ్చును. ఆ విషయము మీర్జాఫరునకుఁ దెలిసినమాత్రమిక నా పెను బ్రతుకనీయడు. శీఘ్రమే నేనెవరికిఁ జెప్పకుండ నాపెనుఁ గాపాడఁ బోయెదను.

(అని నిష్క్రమించును)

తెఱపడును.

---

## ద్వితీయరంగము

---

[బాగో బంగాళాయందలి నాకి కుటీరప్రాంతమున బిడ్డనెత్తుకొని బేగము దుఃఖించుచుండును.]

కర్మఫలములకు భగవంతుఁ డేమి సేయఁగలఁడు? అతని దూఱు టేటికి? ఈకష్టదశయందు నాకీబిడ్డకూడ యేమి? ప్రజలెల్లరు శత్రువులై, రాజ్యమెల్ల పోయినను బ్రతికియుండిన బలుసాకు తిని జీవింపవచ్చునుకదా, యని తలఁచి, పెక్కుశ్రమలంది రహస్యముగ నీ పల్లెఁజేరి, యీ కుటీరమున సుఖముగఁ గాలముఁ గడుపుకొనుచున్న మాకు.........అయ్యో! యింక నాస్థితి యేమని చెప్పుకొందును? ఎంత క్రూరాత్ముఁడైనను నా జీవి

తేనుఁడే బ్రతికియున్న యెప్పటికైన మఱల రాజ్యము సాధిం పకఁబోవునా యను ధైర్యము, యెన్నటికైన మఱల మంచిదినములు రాకఁబోవునా యను యాశయు వెనుక నాకుండెడివి. ఇంక యిప్పుడేమి యున్నవి? భరియింపఁజాలని కష్టములు .........దైవమా! యీ నిర్భాగ్యురాలి దుఃఖమునకింక యంతమున్నదా? ఇంక యేమేమి యగచాట్లు రానున్నవో కదా! మా రహస్యమంతయు నీకనైన ముర్షిదాబాదు జనులకెల్లరకుఁ దెలియకున్నదా! ఈ బిడ్డతో నేనీపల్లెయందునింక బ్రతికియున్న సంగతి ముర్షిదాబాదునకు ప్రస్తుతనవాబగుమీర్జాఫరునకే తెలిసిన యూరకుండునా? ఆతఁడూరకుండిన మతుబుచందుకాని, యాతని వంశీకులు మిత్రులుకాని, ముర్షిదాబాదు ప్రజలుకాని యూరకుందురా? ఆభటుఁడు రహస్యవిధివచ్చి నానాథుని జీవములఁ గొనిపోయెను కాని నాజీవములఁ గొనిపోయిన బాగుగ నుండెడిదికదా! నాకీ వెట్టియేల? ఇంత కష్టదశలో నిట్టి దుఃఖముల ననుభవింపఁ దొల్లిజన్మమున నేనెట్టి పాపములఁ జేసియుంటినో? (అని కొంచెమాగి నలుదిక్కులఁ బరికించి చూచి) అయ్యో! యింకేమియున్నది? నానాథుని రక్తముతో తనక్రోధాగ్ని చల్లార పోవకుండుటచేఁ గాఁబోలు దైవమా! యీ మతుబుచందు కుమార్తె యసామాన్య నా ప్రాణములఁగూడ గొనిపోవుటకుఁ వచ్చుచున్నది. జీవితేశుని జీవ

ములకు భటునిఁ బంపి నాప్రాణములకొఱకు తానే స్వయముగా వచ్చుచున్నది. ఇక నన్నిప్పుడు కాపాడు వారలిం దెవ్వరు? ఏమి సేయుదును? ఎందు దాగుదును? ఈ యాలోచన యేల? పరు విడెదఁగాక!

(అని పరువెత్తుకొని పోవును)

(అసామాన్య ప్రవేశించి)

సాధ్వీ! భయమువలదు. పరువిడెద వెందులకు? ఆగుమాగుము.

(బేగము వెనుక కుతిరిగి నమస్కారములఁ జేయుచు)

తల్లీ! మా యపరాధముల క్షమింపఁజాలవా? జాలివహిం యింపనొల్లవా? అయ్యో! కష్టదశయం దుంటిని. నన్నైన జీవ ములతో విడువుము. రక్షింపుము. రక్షింపుము. రక్షింపుము. (కొంచెము మూగి) నన్ను రక్షించు తలఁపే నీకున్న నన్నిట్లు తఱుము కొని వత్తువా? నీది హృదయముకాదు కాఁబోలు! సాధ్వీ యింత కఠినమా? ఇంత మొండితనమా? దయయనునది యెట్టిదో నీ వెఱుఁగవు కాఁబోలు! కష్టసుఖముల గుర్తింపఁజాలవు కాఁబో తెలిసి ఏమి సేయుదును? ఎంతని వేడుకొందును?

(అని మఱలఁ బరువెత్తుకొనిపోవును)

(అసామాన్య పరువెత్తుకొని వచ్చి)

ఓ దురదృష్ట జాతకురాలా! నన్నుఁజూచిన నీకింత భయ మెందులకు? ఏల నే వలదన్న, మాటి మాటికి పరువెత్తుకొని

పోయెదవు? నేను నిన్నేమి నేయుదును? నిన్నీ కష్టదశలోఁ గాపాడవచ్చితిని. ఆగు మాగుము.

(అని పరువెత్తుకొని పోవును)

తెరపడును

---

## తృతీయరంగము

---

[ఒకనదియొడ్డున బేగము బిడ్డ నెత్తుకొని దుఃఖముతో ప్రవేశించును]

అయ్యో! పరువెత్తుకొని పోవుటకైన నిక వీలులేదే! ఈనది నేనెట్లుదాటఁ గలుఁగుదును! అసామాన్య వెనుక వచ్చుచున్నది కాఁబోలు! ఆపెకుఁ గనబడకుండ నేనెందు డాగుదును? ఎంతవేడుకొన్న నా పుణ్యాచారిత్ర నన్ను విడువకున్నది. దైవమా!—(అని యూరకుండి) నా దుఃఖ మాలకించి నన్నిందోఁచార్చువారలెవ్వరు? (అని నలుదెసలఁబరికించి చూచి) అదిగో యసామాన్య రానేవచ్చినది. ఆనాతికిఁ జిక్కి హైన్యముఁ జెంది నీచ మరణముఁ బడయుటకంటె యీబిడ్డతో నీపుణ్యనదీవతంసము నకే నాయీప్రాణములనర్పించెదఁగాక!

(అని నదిలో దుముకును)

(అసామాన్యవెనుకఁ బరువెత్తుకొనివచ్చి)

అయ్యయ్యో! ఏమిసాహసము! నారాకఁజూచి భయపడి యీపుణ్యాంగన—పవిత్రచారిత్ర—సద్గుణశీల—ఎవరనిచెప్పు

దునుః నవాబగు సురాజుద్దౌలా పత్ని కనులు తెఱువని పసి పాపతో నీ నదీవరేణ్యమునకుఁ బ్రాణము లర్పించినదే! ఏమి సేయుదును. అప్పుడే గతియించునా? నేనుకూడ దుమికెదను. రక్షింపగలుఁగుదునా ధన్యను; లేనియెడల నా జీవములఁగూడ ప్రాణనాథుని సన్నిధిఁ జేరెదఁగాక! (అనిదుముకును)

తెర పడును

---

చతుర్థ రంగము.

---

[నదీప్రాంతమున బిడ్డనెత్తుకొని యసామాన్యప్రవేశము]

ఈబిడ్డనుజూచుచున్న నాకెక్కడలేని దుఃఖముపొంగిపొరలి వచ్చుచున్నది. ఈపసికూనతోపాటు బేగముకూడబ్రతికియుండకఁ బోవునాయని తలఁచితిని. నాతలఁపున కన్యథాత్వముసంఘటిల్లినది. శత్రువుల బిడ్డయైన నేమి. దురదృష్టజాతకురాలు గతిలేనిదైనది కదా! వేగిరమే నేనీపసిబిడ్డనింటికిఁ గొనిపోయి రహస్యముగఁ బెంచెదను. (అని నిష్క్రమించును)

*భరతవాక్యము:*

కరము సం[illegible]ల్లెడఁ • గలుఁగుఁగాత!
దుర్దశలు మిమ్ము[illegible]బుగ • దొలఁగుఁగాత!
[illegible]లకల్లోలము[illegible]తగఁ • బాయుఁగాత!
[illegible]నృపులకు[illegible]జయము • మేల్పడుఁగాత!

*సంపూర్ణము*

శ్రీ రామ.

# ఆంధ్ర బుక్కు డిపో, తెనాలి.

## బుక్కుసెల్లర్సు, అండు పబ్లిషర్సు.

మావద్ద అన్ని రకముల స్కూలు పుస్తకములు, అన్ని రకముల డ్రామాలు, హరికథలు, నవలలు, ప్రబంధములు, డ్రాయింగు పుస్తకములు, యక్సరసైజు పుస్తకములు, శతకములు, హిందీ పుస్తకములు, అక్కౌంటు పుస్తకములు, స్త్రీల పాటలు, అటెండెన్సు రిజస్టర్లు, సంస్కృత గ్రంథములు, జ్యోతిష గ్రంథములు, వైద్య గ్రంథములు మావద్ద సరసమైన ధరలకు విక్రయించబడును.

| | | | |
|---|---|---|---|
| సంపూర్ణ రామాయణం | 1-4-0 | ద్రౌపదీవస్త్రాపహరణం | 1-4-0 |
| సంపూర్ణ భారతము | 1-4-0 | కాంతామతి | 0-12-0 |
| సంపూర్ణ ఉత్తర రామాయణం | 1-4-0 | పాండవ అజ్ఞాతవాసం | 0-12-0 |
| లంకాదహనము | 0-12-0 | సతీతులసి | 1-4-0 |
| లంకాదహనము | 1-0-0 | సువర్ణపాత్ర | 1-0-0 |
| రామరావణసంగ్రామము | 1-0-0 | సురాజుద్దౌలా | 0-8-0 |
| బొబ్బిలి యుద్ధము | 1-0-0 | సుయోధన పరాభవము | 0-10-0 |
| విషాద కనకతారీయము | 1-0-0 | బుద్ధిసాగర విజయము | 0-12-0 |
| సీమంతిని | 1-0-0 | కాశీవిజయము | 0-10-0 |
| మాలవిక | 1-0-0 | పద్మరాణి | 0-10-0 |
| ప్రభాకర | 1-0-0 | కలభాషిణి | 1-0-0 |
| పీష్వా నారాయణరావు | 0-12-0 | శమంతపంచకము | 0-12-0 |
| సం॥ గుల్భోబకావళి | 1-0-0 | చంద్రహాస | 0-12-0 |
| కనకతార | 1-4-0 | సుమతీదేవి | 0-12-0 |
| వీరసంయుక్త | 1-4-0 | తులసీదేవి | 1-0-0 |
| సావిత్రి | 1-0-0 | ప్రమీలార్జునీయం | 0-10-0 |
| భక్త కబీరు | 1-0-0 | శశికళా సుదర్శనీయము | 1-0-0 |
| తులసి దాసు | 1-0-0 | శ్రీరామాంజనేయము | 1-0-0 |
| స్వప్న వాసవదత్తము | 0-12-0 | జనకజానందము | 1-0-0 |
| తారాచంద్రీయము | 1-0-0 | సుభద్రావిజయము | 1-0-0 |

